# భక్తి పాటలు

కీర్తన 100

మాఊరు దేవుడు బంగారు దేవుడు
మాఊరు రాముడు రతనాల రాముడు
మాఊరు దేవుడు నల్లాని దేవుడు
నీలాల మేఘుడు మురిపాల కృష్ణుడు
శ్రితజన పాలకుడు శ్రీవెంకటేశుడు
నిత్యము సత్యము పలికెడు వాడు
నిరతము ధర్మము నిలిపెడు వాడు
చేసిన మేలుని మరవని వాడు
చేయి చాచకనే వరాలు నిచ్చువాడు
సూర్యుని వలెనె వెలిగేవాడు
సుగుణాలకు సరిజోడు వాడు
సాగరమంత కరుణగల వాడు
జగములునేలే జగన్నాథుడు వాడు
కీర్తన 54 విష్ణుం జిష్ణుం వందే వాసుదేవం

విష్ణుం జిష్ణుం వందే వాసుదేవం
వేదం నాదం ఓంకార ప్రణవనాదం
శంఖం చక్రం ఖడ్గదధారి చతుర్భుజం
రామం కృష్ణం నారాయణం నమో స్తుతే ||
భవ భయ హరణం భూతనాదం
వరం కరం తిరువేంకటగిరి నివాసం
ప్రశీదం ప్రాణామం పద్మనాభం
శరణం శరణం శ్రీనాధం ప్రభద్దే ||
అఖిలం నిఖిలం ఆధారనిలయం
అండపిండ బ్రహ్మాండ నాయకం
సహస్రనామం శ్రీనిధిం శ్రీనివాసం
త్రిలోకాత్మం త్రిలోకేశం తిరునామం ప్రభద్దే
105
దీపం లేని వెలుగే దైవం
స్వార్థం లేని సేవే స్వర్గం
మనిషి లోని మంచే మోక్షం
మనసు లోని మెరుపే దైవం
హృది లోని ప్రాణమే దైవం
కష్టం లోని సుఖమే దైవం
మేఘం లేని వరమే దైవం
బంధం లేని అనుబంధమే దైవం
నీలో నాలో ఉన్నది దైవం
నీకు నాకు గమ్యమే దైవం
నిన్ను నన్ను కాచేదే దైవం
నీవు నేను ప్రార్థించేది దైవం
ధర్మాన్ని కాపాడేది దైవం
ధరిత్రిని రక్షించేది దైవం
పాపాన్ని బాపేది దైవం
పుణ్యం నిచ్చేది దైవం
నడవలేనయ్యా స్వామి విడువలేనయ్యా
నడవలేనయ్యా స్వామి విడువలేనయ్యా
నను బ్రోవరావయ్యా స్వామి నారాయణా.....
కొలచి కొలచి కరములు వాలిపోయే
పాడి పాడి పెదవులు వాడిపోయే
నడచి నడచి అడుగులు అలిసిపోయే
జవసత్వాలు నింపుకోలేక ఆగిపోయే
ఏడేడుకొండలు ఎక్కిరాలేక
చేసిన బాసలు నిలిపుకోలేక
తీరము చేరలేక తిరుగు వెళ్ళలేక
ప్రాణాలు విడువలేక ప్రార్థిస్తినయ్యా
నమో వెంకటేశాయ నమో శ్రీనివాసాయ
నను బ్రోవ వేగ రావయ్యా నారాయణా....
నావేదన తీర్చగ రావయ్యా నారాయణా....
నీవేడుక చూపగ రావయ్యా నారాయణా...
నా మనసు మది ఎదా నిండా రాముని రూపమే
నా అక్షరార్చన పదార్చన స్వారార్చన రామ నామమే
నా ఆలాపన, ఆరాధనా, ఆత్మీయ్యగానం ......
అయోధ్య రామునికే , ఆనంద రామునికే ...
అనునిత్యం కొలవాలి ఆ రాముని నామం
అనుక్షణం చూడాలి శ్రీరాముని స్వరూపం !!!
=======================
కీర్తన 23

భాష రానివాడనై
భావమున్న వాడనై
భవబంధాలు నొదలక
భవసాగారాన్ని ఈదక
బృందావనము చూడక
భగవద్గీత ననుసరించక
బహుదూరమైన గమ్యాన్ని
బహుసునాయాశముగా ఎంచుకొని
బాధలేన్నో పడుచున్న నాకు
భగవంతుని తీరము దొరుకునా
భాగవతప్రియుని ఆశీస్సులు పొందేనా
భక్తవత్సలుడు బంధం కలుపునా
భక్తమనోహర రూపాన్ని దర్శించేనా!!!!
=======================
కీర్తన 24

కామి గాక మోక్ష గాము......

వాలు జడ వేసిన, వన్నెల సీర చుట్టిన
మల్లెలు సిగలో ముడిచిన సిన్నదాన్ని
సాకిరేవు బండకాడ సుసినానురో
సిగ్గుమొగ్గలై సిందులేసినానురో
సూపులేమో ఆగిపోయే ,
మాటలేమో మూగపోయే
మనసేమో మరలిపోయేరో

దాని ఓంపుసొంపుల వయ్యారాలు,
నవరసహొయల నయనాలు,
నా కన్నులకే కలవారమాయె,
నా మదియంతా మురవరమాయే
నన్ను నేను మరిచినాను రో
చెట్టు మాటు చేరి సైగ చేసినానూరో
కాదుగూడదు నంటే ఛీ పోరా సీన్నోడ
మగువల నందాలు మున్నాళ్ల ముచ్చటెరా
మాధవుని శాశ్వితమైన నన్దముచూసి తరించరా
నంటూ మంచి మనసుతో మసులుకొమ్మన్దిరా
సన్యాసము పుచ్చుకొని రామ రామ నంటూ
రూట్ మార్చమన్నాదిరొ
హరిని కొలుచుకొంటూ
సప్తగిరులు చేరి
శ్రీనివాసుని సంకీర్తన చెయ్యమందిరో
ఓ సాకిరేవు బండకాడ సిన్నదాన
నా రూట్ మార్చినావు నా రాత మార్చినావు
కామి గాకనె మోక్షమునకు పంపుతున్నావు!!
========================
కీర్తన 25

ఎండిపొఇన కొమ్మ మీద
ఒట్టుబొఇ గట్టులేని చిలకనై
వాడిపొఇ రాలిపోయే ఆకునై
మొడు బారిన మొవినై
వెన్నెల కురవని రేఇనై
మేఘము లేని చినుకునై
నీరులేని ఏరులో నావనై
నిర్యాణమైన తోడులేని నడవిలొ
నిదురరాని నీడలేని నారినై
నెదురుచూచి నారాముడికై
నేరేడుపండ్లుతో నెదురేగితిని
రానె వచ్చితీవా రామా
నీరు పోసినావు ఈకొమ్మకు
తేనీరు చల్లినావు తుమ్మెదపైన
నాజన్మ తన్మయత్వముతొ తరించినే రామ....
తీవ్ర పరితాపంతో
ఆశతో కూడిన చూపుతో,
ఏళ్ళునాళ్ళు స్మరణతో
నాజీవితమే నైవేద్యంగా ,
నాఊపిరే హారతిగా
నా రామునికి నర్పించు సమయాన
రానె వచ్చితీవా రామా. . సీతారామా. . .
జగధభిరామా. . జానకి రామ ..
తీసుకోవయ్యా. . .నను అక్కున చేర్చుకోవయ్యా. .
=======================
కీర్తన 26

మది మారిపోయింది
మాట మురిసిపోతుంది
మనసే మరలిపోయింది!
తీరని తాపంతోనంది మాధవా ............
రాధను మళ్లీ మళ్లీ చుడవా .........
నంటూ ముందుకు సాగిపోయింది!
కాలం కాసేపు ఆగింది
ఆదమరచి కనురెప్ప వాల్చింది
కమ్మని కలగా కరిగింది...!
తనువె తడబడుతోంది
తుమ్మెదలా ఝుమ్మని ఎగిరింది
ప్రేయసీ ప్రేమనాదం మోగించింది
మది తలుపులు తెరిచింది
ఎదలో తెరలు తొలగించింది
మది మాధవుణి ఊహలతో నింపింది
ఎద రాధమాధవుణి రూపంతో నిండింది!
ఆర్తితో కృష్ణా.......యనికొలచింది
వేణువై ఒడిలో ఒదిగి పొమ్మంది
లీనమై తన జన్మను తరింపజేయమంది !
===================
కీర్తన 27

రగిలిందిలే కొండ గాలి
రమ్మందిలే కన్నే వాలి
మోగిందిలే మోహన మురళి
ఆడిందిలే అందెల రవళి
కరిగిందిలే కరి మబ్బు కోరి
కురిసిందిలే నింగినుంచి జాలు వారి
విరిసింధీలే వయ్యారల కేళీ
పొంగిపొరలిందిలే ప్రేమ కడలి
మెరిసిందిలె మనసుల మార్పిడి
ఉరిమిందిలే తనువల తాకిడి
ఒక్కటైయ్యిందిలె రాధామాధవ జోడీ!!!
==================
కీర్తన 33

పండునై రాలిపోక ముందే
కొండకు నొకసారి పిలువరా దేవా
కనుచూపు మసకబారక ముందే
కనులకు ఓసారి కానరారా దేవా
గొంతు బొంగురుకాక ముందే
గుడిలో ఓసారి గానం చేయనీరా దేవా
రాముడు నీవేనని రాగము చేసితిని
కృష్ణునికై కవితాజల్లు కురిపించితిని
శ్రీనివాసునికి సంకీర్తనాభిషేకం చేసితిని
ఏడుకొండలవాడా ఎమారక వేడుకొంటిని
హేరంగా గంగాతరంగా ఏడుకొండల రంగా
హృదయానికి హత్తుకొరా నను హృదయాంతరంగా
ఏడుకొండలవాడ వెంకట రమణా గోవిందా
గోవిందా గోవింద హరి గోవిందా !!!
==================
చిత్రం: కీర్తన 104

నీలాల నీలిమేఘశ్యామునికి
నిండు జాబిల్లికి బొండు మల్లికి
నిత్య కళ్యాణమే నవ వసంతమే
కొండలరాయుడికి కలువుల నయనాలకి
కల్యాణ వైభొగమే కనులకు కమనీయ్యమే
నింగిన పచ్చనిపరిణయ తోరణాలు
నేలమీద అంబరాన్నంటే సంబరాలు
జగమంతా జగన్నాధుని జాతరలు
ముక్కుపచ్చలారని ముద్దుగుమ్మలకు
ముత్యాల రతనాల మురిపాల తలంబ్రాలు

అంబరాన్నుంచి రాలిన అత్మీయ్య అక్షింతలు
దివినుంచి దేవాదిదేవుల దేవతల దీవెనలు
నరులకు నయనాలకు కన్నుల విందులు
==========================
చిత్రం: కీర్తన 103

నింగిలోని నెలవంకా చూడవా నావంక
గూటిలోని గోరువంకా రావా నావంక
దూరదూరమెందుకోయి దరిచేరరావోయి
దాగుడుమూతలేలోయి దర్శినమీవోయి
గ్రోవి పిలిచెనోయి గూడునొదలి రావోయి
బృందావని ఆశగాచూసే గోపాలుడు ఎదురేచూసె
ఇష్టమైన కష్టమైన రాకమానునా
వేణుగానానికి వృందా ఆడకమానునా
గోపాలురు గోపికలు ఎందరు చుట్టున్నా
గోపగోపికవు నీవేలె నాగ్రోవి నీదేలె
మనిషొకచోట మనసొకచోట ఇలాఎన్నళ్ళూ
మూడుముళ్ళు వేసి ఏడడుగులు నడవరాద
నేను నీవు కాదా నీవు నేను కాదా
నేనునీవు ఒకటై మనసంతా నీవేకదా
చిత్రం: కీర్తన 102

మది ఏది మరిచిన
మనసైన మాధవుని
మరువబోదు ఈ మనసు
అనురాగ సీమలో
అలవుకాని ఆనందములో
మురిసి తరించిన ఆ తరుణం
మరువబోదు ఈ మనసు
పదేపదే వల్లెవేసుకొంటూ
ప్రేమను పదిలంగా దాచుకొంటూ
ఎద పరవశమైన ప్రతి క్షణం
మరువబోదు ఈ మనసు
మనసే మందిరమై మందిరమున
మాధవుకై ప్రేమానురక్తితో భక్తితో
తననుతాను సమర్పించుకొన్న
రాధనైనం మరువబోదు ఏ యుగం
=======================
చిత్రం: కీర్తన 101

అటు ఇటు ఎటు చూసినా నీవే
అలా ఇలా ఎలా చూసినా నీవే
మాట పాట ఏమీ పాడినా నీదే
మది హృది ఎద నిండుగా నీవే
ఎందుకో ఏమిటో కొత్తకొత్తగా ఉన్నదే
చిత్ర విచిత్రంగా వింతవింతగా ఉన్నదే
అణువణువున నీవై పదపదమున నీవై
అనుక్షణమున నిన్నే క్షణక్షణమున నిన్నే
మరీ మరీ నిను చూడాలంటూ
పదే పదే నీపాట పాడాలంటూ
పరవళ్ళు తొక్కుతున్నదే నా గానము
కదంతొక్కి కదులుతున్నదే నా ప్రాణము
ఏడుకొండలవాడా వెంకట రమణ
సంకట హరణ గోవిందగోవిందా
చిత్రం: కీర్తన 100

మాఊరు దేవుడు బంగారు దేవుడు
మాఊరు రాముడు రతనాల రాముడు
మాఊరు దేవుడు నల్లాని దేవుడు
నీలాల మేఘుడు మురిపాల కృష్ణుడు
శ్రితజన పాలకుడు శ్రీవెంకటేశుడు
నిత్యము సత్యము పలికెడు వాడు
నిరతము ధర్మము నిలిపెడు వాడు
చేసిన మేలుని మరవని వాడు
చేయి చాచకనే వరాలు నిచ్చువాడు
సూర్యుని వలెనె వెలిగేవాడు
సుగుణాలకు సరిజోడు వాడు
సాగరమంత కరుణగల వాడు
జగములునేలే జగన్నాధుడు వాడు
========================
కీర్తన 103

నింగిలోని నెలవంకా చూడవా నావంక
గూటిలోని గోరువంకా రావా నావంక
దూరదూరమెందుకోయి దరిచేరరావోయి
దాగుడుమూతలేలోయి దర్శినమీవోయి
గ్రోవి పిలిచెనోయి గూడునొదలి రావోయి
బృందావని ఆశగాచూసే గోపాలుడు ఎదురేచూసె
ఇష్టమైన కష్టమైన రాకమానునా
వేణుగానానికి వృందా ఆడకమానునా
గోపాలురు గోపికలు ఎందరు చుట్టున్నా
గోపగోపికవు నీవేలె నాగ్రోవి నీదేలె
మనిషొకచోట మనసొకచోట ఇలాఎన్నళ్ళూ
మూడుముళ్ళు వేసి ఏడడుగులు నడవరాద
నేను నీవు కాదా నీవు నేను కాదా
నేనునీవు ఒకటై మనసంతా నీవేకదా
===========================
కీర్తన 102

మది ఏది మరిచిన
మనసైన మాధవుని
మరువబోదు ఈ మనసు
అనురాగ సీమలో
అలవుకాని ఆనందములో
మురిసి తరించిన ఆ తరుణం
మరువబోదు ఈ మనసు
పదేపదే వల్లెవేసుకొంటూ
ప్రేమను పదిలంగా దాచుకొంటూ
ఎద పరవశమైన ప్రతి క్షణం
మరువబోదు ఈ మనసు
మనసే మందిరమై మందిరమున
మాధవుకై ప్రేమానురక్తితో భక్తితో
తననుతాను సమర్పించుకొన్న
రాధనైనం మరువబోదు ఏ యుగం
============================
కీర్తన 101

అటు ఇటు ఎటు చూసినా నీవే
అలా ఇలా ఎలా చూసినా నీవే
మాట పాట ఏమీ పాడినా నీదే
మది హృది ఎద నిండుగా నీవే
ఎందుకో ఏమిటో కొత్తకొత్తగా ఉన్నదే

చిత్ర విచిత్రంగా వింతవింతగా ఉన్నదే
అణువణువున నీవై పదపదమున నీవై
అనుక్షణమున నిన్నే క్షణక్షణమున నిన్నే
మరీ మరీ నిను చూడాలంటూ
పదే పదే నీపాట పాడాలంటూ
పరవళ్ళు తొక్కుతున్నదే నా గానము
కదంతొక్కి కదులుతున్నదే నా ప్రాణము
ఏడుకొండలవాడా వెంకట రమణ
సంకట హరణ గోవిందగోవిందా
=================================
కీర్తన 99

గుడిలో నున్నవాడు
నాగూడు చేరెనే ఈవేళ
దివిలో నున్నవాడు
భువిని చేరెనే ఈవేళ
సిరిచెంత నున్నవాడు
శబరిఇంట చేరెనే ఈవేళ
పంచభక్ష పరమాన్నాలు
నారాగించు పరమాత్ముడు
పుల్లని నెంగిలి నేరేడు
పండ్లు నారగించెనే ఈవేళ
రామ రఘురామ నీరాకతో
పావనమాయె నాకుటీరము
చరితార్థమాయె నాజన్మము
నీలో ఐక్యమైపోని నాజీవము
================================
కీర్తన 98

కడలికి పొంగు నేర్పింది
కవితకు హంగు అద్దింది
కౌసల్యరామ నీనామం...
కోమలికి ప్రాణం పోసింది
కోరికలకు కళ్ళెం వేసింది
పరంధామా నీపాదం...
ధనస్సు దాసోహం నన్నది
ధర్మమే నీవెంట నడిచింది
దశరధరామ నీరూపం...
జానకి జవరాలు నన్నది
జగము జయహొ నన్నది
జగదభిరామ నీవిజయం
రఘుకులతిలకా సీతానాయక
నానోట నీపాట నేలా
నాకింతకన్నా భాగ్యమేలా
==================================
కీర్తన 97

అమ్మా మాయమ్మ అలిమేలమంగమ్మా
నా మొర ఆలకించవమ్మా
హరి నామమే నా గానమని
హరి గానమే నా ప్రాణమని సాగే
నాఆలాపన ఓసారి ఆలకించమని
అడగవేమమ్మా అలిమేలనాధుని
శ్రీవారి సేవ నాకు వరమని
మరలమరలా హరిదాసునై కీర్తిస్తానని
నావిన్నపము ఒకసారి వినమని
విన్నవించవేమమ్మా పతిదేవునికి
జన్మజన్మల రుణమని
జగమేలువాడిని జపిస్తూ
తిరుమలేసుడికై తపిస్తున్నాని
చెప్పవా నాతల్లి చెంతకు చేర్చుకొమ్మని...
నాస్వామి మనస్వామి శ్రీనివాసునికి
===================================
కీర్తన 96

ఏలుకోవయ్యా స్వామి నన్నేలుకోవయ్యా
ఏడుకొండల స్వామి నన్నేలుకోవయ్యా
ఎలుగెత్తి నీనామం ఎల్లవేళలా కొలెచెదనయ్య
నిలువెత్తు నీరూపం దర్శించుటకై నిరీక్షించెదనయ్య
ఏమారక స్వామి ఏడుకొండలవాడా వెంకటరమణ
నామొర నాలకించగరారా నాస్వామిఏడుకొండలవాడా
ఎందున ఉన్నావయ్యా స్వామినని ఎవరు ప్రశ్నించినా
నెందునైనా గలనంటూ నిండైన వరాలు ప్రసాదించరా
ఏడుకొండలవాడా వెంకటరమణా సంకటహరణా
నేడునను బ్రోవగ రారా నాస్వామిఏడుకొండలవాడా
===================================
కీర్తన 95

పలకాలి రామనామం
పాడాలి రామగీతం
మధురమైన రామనామం
మోక్షానికి సులభమార్గం
మనోరంజక తారకమంత్రం
సప్తవ్యసన విమోచనతంత్రం
మధురమైన రామగీతం
సుధారస మందార మకరంద
సుమధుర సప్తస్వర సంగీతం
మహావిష్ణువుకి మనోఉల్లాసం
అమరం అమరం రామనామం
తిమిరానికి తేజం రామగీతం
భువికి దివికి దివ్యబంధనం
భక్తికి ముక్తికి దివ్యామృతం
పలకాలి రామనామం
పాడాలి రామగీతం
===================================
కీర్తన 94

ఎవరు నీవారెవరు
ఈజీవన పయనంలో
ఈజీవిత సమరంలో
అందరూ నీవారే
జనమందరూ నీవారే
జగమంతా నీవారే నని
భ్రమలో బ్రతికేవు
మాయలో మురిసేవు
బంధాలలో బంధీనయ్యేవు
భగవంతుని మరచేవు
భవములు బాపుకొనేవు
చివరకు చింతించేవు...
తేరుకోరా మేలుకోరా నరుడా
మూలము తెలుసుకోరా నరుడా
హరియే సర్వమురా నరుడా

=======================================
కీర్తన 93

ఇల్లు ఇల్లాలని ఈశ్వరుని
సన్నుతి మరువకే మనసా
ఇల్లున్న ఇల్లాలున్న
సిరులున్న సంపదలున్న
కావాలి నీకు ఈశ్వరేచ్చ
కలగాలి శ్రీహరి కృపాకటాక్ష
మరుజన్మ మనకు ఉందోలేదో
మాధవుని తలచగలమొ లేదో
రేపో మాపోనని జాగు చేయక
శ్రీకారముచుట్టవే శ్రీహరిస్మరణకు
మనసా వాచా కొలవవో మనసా
తూచా తప్పక తలవవొ మనసా
అదే మోక్షము అదే కైవల్యము
=====================================
కీర్తన 92

ఆదేశించారా దేవా
నీఆరాధనకై ఆలాపనకై
దేవాధి దేవా ఆరాధ్యదేవా
ఆపద్బాంధవా ఆలిమేలవాసా
శేషశయనవాసా శ్రీ శ్రీనివాసా
సకలలక్ష్మికళావల్లభా శ్రీవేంకటేశా ||ఆదేశించారా||
అలుపెరగక ఆరాధించెదనయ్యా
ఆనందముగా ఆలపించెదనయ్యా
నీ ఆరాధనే నాకు పరమానందము
నీ ఆలాపనే నాకు బ్రహ్మానందము ||ఆదేశించారా||
పాట నే కావాలా,ప్రేమ నే కావాలా
ప్రాణమే కావాలా ఏమీ కావాలో
ఓ పద్మావతిప్రాణనాథ పురుషోత్తమ
ఆలస్యమేలరా ఆనతినీయ్యరా దేవా
=======================================
కీర్తన 91

లేడు లేడురా
నీ లాంటి దైవము ఈలోకంలో
ఎందెందు వెదికినా
ఏడేడు లోకాలు వెదికినా
లేడు లేడురా
నీ లాంటి దైవము ఏడేడులోకాలలో
పరికించి పరికించి
పదనాలుగు భువనాలు చూసినా
లేడు లేడురా
నీ లాంటి దైవము పదనాల్గుభువనాలలో
ఎంత భాగ్యమురా దేవా
ఏడుకొండలలో వెలసినావు
ఎనలేని వరాలు నొసిగినావు
ఏడుతరాలకు బంధమేసినావు
ఏడుకొండల వాడ..లేడు లేడురా
నీ లాంటి దైవము ఏడేడులోకాలలో
=======================================
కీర్తన 90

అటు చూస్తే గోదారి
ఇటు చూస్తే భద్రగిరి
నామనసే ఆ మెట్టు పైన
నేనేమో ఈ గట్టు పైన
ఎగెరెగిరి రావాలని
నీచెంత చేరాలని
నీపాటలు పాడాలని
నీఆటలు ఆడాలని
కలలెన్నో కన్నాను రామ
హరే హరే హరే రామ
కన్నులతో కౌసల్య రామున్ని కట్టేసి
గుడిలో దేవుణ్ణి గుండెల్లో దాచేసి
ప్రాణంతో జ్యోతిని వెలిగించి హారతినై
హరినామస్మరణలో కరిగిపోనా రామ
=======================================
కీర్తన 88

నాది నాదియని పాకులాడకు నరుడా
నాదన్నది నేలమీద నేదిలేదు నరుడా
నీది నాది నగనగవుల నాటకమె నరుడా
మట్టిబొమ్మలాటలో మురిసిపోకు నరుడా
మహావిష్ణుమాయని మరచిపోకు నరుడా
బంధాలని భవములు బాపుకోకు నరుడా
చూసినదల్లా నిజము కాదు నరుడా
చేసినదల్లా నీతోడుగ రాదు నరుడా
సిరిసంపదలతో సుఖము రాదు నరుడా
చివరకు శ్రీహరి చిత్తమె శరణం నరుడా
నాది నాదియని పాకులాడకు నరుడా
నాదన్నది నేలమీద నేదిలేదు నరుడా
=======================================
కీర్తన 87

చూడు చూడు సిన్నక్క
చూడ ముచ్చటైన సిన్నోడిని
సప్తగిరుల పైన ఆ చందురోడిని
సుక్కల్లో సక్కాని సుక్కవాడు
సూడబోతే ముద్దైన చిన్నవాడు
సిరలతో చిటారికొమ్మన చేరినాడు
ముగ్గురమ్మల ముద్దుల తనయుడు
మాట తప్పనోడు మడమ తిప్పనోడు
ముల్లోకాల నేలే మహారాజు వాడు
సిర్రెత్తితే సింహమల్లె దూకుతాడు
స్మరిస్తే సల్లనికుండై సేదతీర్చుతాడు
సిలిపిచేష్టలతో సందడిసందడి చేస్తాడు
=======================================
కీర్తన 86

దేవుడు ఉన్నాడా లేడానంటె
వున్నాడంటే వెంటేనన్నాడు
లేడంటే లేనే లేనన్నాడు
నమ్మకము నున్న వారికి
నుపకారముచేయు నారాయణుడు
కంటికి కనురెప్పలా కాపాడుతానన్నాడు
అపనమ్మకము నైనా వారికి
అపకారము తలపెట్టనన్నాడు

కలలోనైనా కష్టపెట్టనన్నాడు
శ్రద్ధాభక్తులతో సేవిస్తే
చింతలేని సుఖాలునిస్తానన్నాడు
సన్నిహితుడై చెంతనుంటానన్నాడు
అశ్రద్ద చేయు వారిని
ఆపదలెల్ల ఆదరిస్తానన్నాడు
తనదారికి మళ్లించుకొంటానన్నాడు
నమ్మర నరుడా నారాయుణుడిని
వేడర వరుడా వెంకటేశుడిని
హరుడైనా సేవించు హరినారాయునుడని
============================
కీర్తన 84

ఎదురుగా నీవుంటే కనులే కలిసెనులె
ఎక్కడో నీవుంటే భావాలే కలిసెనులె
మదిలో నిన్నే తలచెనులె
మనసులు రెండు కలిసెనులె
తనువులు ఒకటిగా చేసెనులే
హృదిలో నిన్నే నిలిపెనులే
ఎదురుగా నీవున్నా రాకున్నా లేకున్నా
ఎన్నెన్ని భావాలో ఎల్లలులేని బంధాలో
ప్రతిక్షణము పరితపించే ప్రేమానురాగాలో
అనుక్షణము గుర్తుచేసే అరవిందునిఅందాలో
లవ్ యూ లవ్యూరా ఓ లలనా
నా మదియంతా నీవేరా మదనా
నా మనసు నీకేరా నందనందనా
వృందావనానికి రావా వెన్నెలవదనా ...
================================
కీర్తన 83:

ఏమని పిలిచేది స్వామి
నిన్నేమని పిలిచేదీ స్వామి
ఏల కొలిచేది స్వామి
నిన్నెలా కొలిచేది స్వామి
ఏమని పిలిచిన పలికేవు స్వామి
ఏల కొలచిన కరిగేవు స్వామి
గోవిందుడై నాగుండెలో ఇమిడినావు
గానమై నాగళములో నడయాడినావు
కీర్తనై నాకలములో నాట్యమాడినావు
కానీ నీకు నాకు ఎంతో దూరం
ఏనాడూ కల్గునొ నాస్వామి అనుగ్రహం
===============================
కీర్తన 82:

చల్లాచల్లని దైవమా
చల్లగుండుట భావ్యమా
నల్లానల్లని మోహమా
మెదలకుండుట న్యాయమా
కారణంబుతో కొలచినా
కోమలి ఎకరవు పెట్టినా
ఉలుకక పలుకక మెదలక
నిమ్మకు నీరెత్తి నట్టుగా
చిరుమందహాసముతో శిలగా
నిలుచట న్యాయమా భావ్యమా
==============================
కీర్తన 81:

చిన్న చిన్న దేవుళ్ళు
చిల్లర మల్లర దేవుళ్ళు
చేయి చాపు దేవుళ్ళు
శత కోటి దేవుళ్ళు
ఊరంతా ఉత్తొత్తి దేవుళ్ళు
వాడంతా విభూధి దేవుళ్ళు
ఇల్లంతా పటాల దేవుళ్ళు
మూలము మరచి మనీకి వెరచి
చిత్ర విచిత్ర వేషాలకి మురిసి
చేయికాలిన తరుణాన ఆకుపట్టిన
సందాన చివరకు శ్రీహరిని సేవించేరు...
మనసా ఎరుగవే ఏడుకొండల వాడిని
మరువక తలపవే ఏడేడుకొండల వాడిని
==============================
కీర్తన 79:

మా అమ్మకు అమ్మవు నీవయ్యా
మా అయ్యకు అయ్యవు నీవయ్యా
మా బంధాలకు బంధువు నీవయ్యా
మా అనుబంధాలకు అత్మీయ్యుడవు నీవయ్యా
ప్రాణాలకు మిగుల ప్రాణము నీవయ్యా
దిక్కులకు దొడ్డ దిక్కువు నీవయ్యా
దివిలో వెలిగే దీపం నీవయ్యా
భువినే మోసే విభుడవు నీవయ్యా
మా ఇలవేలుపు నీవయ్యా
రాముడవైనా కృష్ణుడవైనా నీవేనయ్యా
ఏడుకొండల వేంకటరమణయ్య
ఏడేడుకొండల వేంకటకృష్ణయ్యా
=================================
కీర్తన 75:

రామా రామా అంటూ శ్రీరామ సీతారామ నంటూ
అడుగునఅడుగేసికొంటూ ఆమడలు నడుచుకొంటూ
గోదారి గట్టు దాటినాను భద్రాద్రి మెట్టు చేరినాను
హనుమంతుడొచ్చి హృదయానికి హత్తుకొనగా
గరుక్మంతుడు గబగబనొచ్చి గుడి తెరచినాడు
లక్ష్మణుడు లోనికి రమ్మని ఆహ్వానించినాడు
సంతసమ్ముతో సీతమ్మతల్లి చెంతచేర్చుకొనీ
ఆదరించి అలసటను తీర్చి అమ్మనై ఆకలితీర్చి
కష్టమేలనయ్యా కొలిచిన మేమురామానని వారించి
అయ్యా చెంతకు రామయ్య చెంతకు నన్ను చేర్చినాది
రామదాసు రామకీర్తనలు ఆలపించగా
తానీషా తారకరాముని తీర్థము ఇవ్వగా
కలువులరేడు కౌసల్యరామయ్య కరుణించినాడు
దశరథరామయ్య దశావతారకరాముడై దర్శనమిచ్చాడు
==================================
కీర్తన 74:

వేవేల దండాలు వెంకన్నా
శతకోటి దండాలు శీనన్నా
సిరివి హరివి నీవే శీనన్నా
నీసాయం సాటిలేనిదన్నా
సాయానికి శతకోటిదండాలు శీనన్నా

వేదం విశ్వం నీవే వెంకన్నా
నీవిశ్వాసం వెలకట్టలేనిదన్నా
విశ్వాసపాత్రునికి వేవేలదండాలు వెంకన్నా
నీకు వేడుక మాకు వరము వెంకన్నా
నీకు సేవ మాకు సంబరము శీనన్నా
దాసుని దండదండాలు దశావతారకరామన్న
=================================
భూమి బీడుబారె
మాను మోడుబారె
నిలువ నీడలేక
గుక్కెడు నీరులేక
ఆశలు ఆవిరాయే
జీవితాలు భారమాయే
ఊరు వదలిపోయే ...
వలస వెళ్ళిపోయే
వాడ వెలవెలబోయే
పల్లె చిన్నబోయే
దేవుడా నీవెక్కడా
దీనుడకు దారెక్కడా
పేదోడికి వెలుగునెక్కడా
కరువుకి నీకరుణనెక్కడా
ఎక్కడా నీవెక్కడా ....
ఏడుకొండలవాడ నీవెక్కడా ....
==============================
కీర్తన 73:

వరములు నొసగాలంటే
సిరులు పొందాలంటే
పాపాలు హరియించాలంటే
భక్తితో హరిని కొలవవో మనసా
ఆర్తితో శ్రీహరిని తలవవొ మనసా
వరములు వరహాలై వర్షించునులే
సిరిసంపదలు ఇంట పొంగిపొరలేనులే
పాపాలు పావనగంగలో కడిగేనులే
భక్తితో హరిని కొలవవో మనసా
ఆర్తితో శ్రీహరిని తలవవొ మనసా
==============================
కీర్తన 72:

తిరుమలలో కొలువైన తిరుత్తుణి స్వామి
తెరలు తొలగించు తరుణం ఇదే స్వామీ
తెలియని వారికి తెలుపగరారా స్వామీ
నేల పరిచింది పూలబాట నీ నడకకు
గాలి పాడింది స్వాగతాలు నీ రాకకు
నింగి వర్షించింది వెన్నెల నీ కొలువుకు
కోరకనే వరాలిచ్చి కొండంత వెలుగు నిచ్చి
మమతెరిగిన దేవుడవై మనసున్న మాధవుడై
కదలిరారా స్వామి కదలిరా కొండలరాయుడవై కదలిరా
==================================
కీర్తన 71:

రాయె రాయె రత్తమ్మ రామలోరి గుడికమ్మొ
రాయె రాయె రత్తమ్మ రామలోరి గుడికమ్మొ
రంగురంగుల రాట్నము నెక్కిస్తా
రంగురంగుల గాజులు కొనిపెడతా
రఘుకుల రాముడు దశరధరాముణ్ణి చూపెడతా || రాయె రాయె||
విల్లునే విరిసినాడు మనసునే దోచినాడు
దండనే వేసినాడు సీతనే పెండ్లాడుతున్నాడు
సీతారాములు కళ్యాణ వైభోగమంట
పిల్లాజల్లా ఊరువాడా సంబరమంటా
నింగినేలలో నెన్నడు జరగని జాతరనంట || రాయె రాయె||
కొలుసు కొంటె కష్టాలు తీరుస్తాడంట
నమ్ముకొంటె నీడలా ఉంటాడంట
భజన చేస్తే బాధబంధీలు లేనేలేవంట || రాయె రాయె||
రాయె రాయె రత్తమ్మ రామలోరి గుడికమ్మొ
రాయె రాయె రత్తమ్మ రామలోరి గుడికమ్మొ
================================
కీర్తన 70:

అన్నింటికి నేనే మూలం
జగమంతటికి నేనే జీవం
జననం మరణం సహజం
జీవిత గమ్యం దానంధర్మం
మళ్లీమళ్లీరాదు మానవజన్మం
మర్మమెఱిగి ఎంచుకో మంచిమార్గం
పదిమందికి సాయం దైవత్వం
పరమాత్ముని ప్రార్ధన పరమోన్నతం
అదే నీ కర్తవ్యం ..జీవిత సాఫల్యం..
నలుగురికి ఆదర్శం.. ఈ జన్మ రహస్యం .
===========================
కీర్తన 69- పద్మావతి పరిణయ అప్పగింతల సమయానా :

ప్రేమతో పలుకవే ప్రేమనే పంచవే
ప్రియురాల.. జవరాల.. ఓ ఆలిమెలా
ప్రేమతో పలుకవే ప్రియురాల
ప్రేమనే పంచవే జవరాల ...
అమ్మనై లాలించవే అలిమేల
ఇల్లాలివై ఒడినియ్యవే ప్రియురాల
ప్రియుని అధరానికి పల్లవై
మగడి మనసుకి మధురిమై
చెలికాడి చేయివిడువని శ్రీవల్లివై
తోడువై నీడవై వీడరాని జంటవై
కలకాలం చిరకాలం కలిసి మెలిసి
పాలలో నీళ్ళలా కొలనులో కలువలా
చిలకా గోరింకలా గూడున ఒదిగిపోవే...
పతియే దైవమని పసుపుకుంకమ పవిత్రమని
పుట్టింటికి మెట్టింటికి అదియె గౌరవమని
మసలుకోవే నీ ఇల్లే కోవెలగా మలచుకోవే...
===============================
srungaara Keertana 68:

మదిలో ఒకరు... ఎదలొ ఒకరు...
ఎలపట ఒకరు.. దాపట ఇంకొకరు...
ఇంటిలో రాముడు వీధిలో కృష్ణుడై
నెరజాణల నడుమ నారాయుణుని నాటకం
వయ్యారి భామలతో వేంకటేశుని విడ్డూరం
శ్రీదేవి సింగారము చూసి సంబరపడగా
భూదేవి బంగారము బుంగమూతినాయే
ఆదిలక్ష్మి ఆందాలతో ఆనందమవగా
ఆలిమేలుమంగ అలకపాన్పు నెక్కినే
శ్రీదేవి కస్సులాడేనే భూదేవి బుస్సుకొట్టేనే

రామరామ ఇపుడేమిచేతువు రా వెంకటరామ
ఇరువురిభామల కౌగిలిలో ఇరుకునపడితివే రామ
జోడెద్దుల బండిమీద జోరుగా సాగుతున్నావనుకుంటినే
జోరీగల్లే జాణల జగడాలతో బేజారునైతివే రామరామ
రామరామ అయ్యోరామరామ ఏడుకొండల వెంకటరామ...
===================================
కీర్తన 67:

రామ నామము కంటె
వేణు గానము వింటే
సరిగమలన్ని సరసాలాయే
రాగాలన్ని రసమయమాయె
రామా నీనామం మాధురాతిమధురం
శ్యామా నీగానం నవరసనాట్యభరితం
సప్తస్వరముల సుమధురసంగీతం
సహస్రసరాగాల రాగరసమయరజితం
రామా నీనామం నిత్యనవనీతం
శ్యామా నీగానం గాన గంధర్వం
మృదంగములు తానాతందానం
వాయిద్యాలు వేదతాండవం
రామా నీనామం మాధురాతిమధురం
శ్యామా నీగానం నవరసనాట్యభరితం
================================
కీర్తన 66:

నల్లానల్లని దైవమా తెల్లాతెల్లని మేఘమై
చల్లా చల్లని వరాలఅమృతమై కురియుమా
తీరనిదాహము తీర్చుమా దరి చేర్చుమా
నల్లని వన్నీ నీళ్ళని తెల్లనివన్నీ పాలని
నమ్మిన వాడిని మంచిచెడు తెలియనివాడిని
నారాయణుడే దైవమని నమ్ముకొన్నవాడిని
కడలి లోతు కష్టాలు కడుపులో దాచుకొన్నా
ఎండమావులని ఎరుగక ఎడారిలో ఎదురోతున్నా
గమ్యం తెలియని గగనాన పతంగమై ఎగురుతున్నా
నల్లానల్లని దైవమా తెల్లాతెల్లని మేఘమై
చల్లా చల్లని వరాలఅమృతమై కురియుమా
తీరనిదాహము తీర్చుమా దరి చేర్చుమా
=================================
కీర్తన 65:

చేసిన బాసలు చూడకురా
నెరుగని తప్పులు దండించకురా
కొండంత మనసుతో కరుణించారా
అండ దండా నీవై మము కాపాడరా
ఓ కొండదేవరా కరుణ బ్రోవరా
ఓ వెంకటేశ్వరా వెతలు బాపరా
ఓ హరిహరేశ్వరా పాపాలు హరించరా
ఓ పరమేశ్వరా ముక్తి ప్రసాదించారా
ఏలినాటిదైవమా ఏడుకొండల ప్రత్యక్షదైవమా
వెసులుబాటు లేదు వడ్డీకాసులు అడుగకురా
సిరి సహవాసముతో మా ఇంట చేరరా
సదా సేవలు అందుకొరా మాఇల దైవమా
================================
కీర్తన 64:

అన్నమయ్య ప్రతి పదము
కమ్మనైన ప్రీతి ఫలము
అరుదైన అంత వరము
ఎన్ని జన్మలెత్తినా ఎంత వేడినా
దొరుకునా అమృత పదఫలము
అనంతపద్మనాభుని అంశము
పూర్వజన్మ సుకృతము
మాతృపితృదేవుల పుణ్యఫలము
అలిమేలమంగపతుని ఆశీర్వాదము
పుడమిన వికసించిన పారిజాతము
సప్తస్వరముల సంగీత సాగరము
వీనులకు విందైన వేణుగానము
పురుషోత్తమునికి పదకవితార్చనము
============================
కీర్తన 63:

దర్శనం స్వామి సర్వదర్శనం
ఎన్నటికీ మరుపురాని జ్ఞాపకం
పరిచయం విభుని తొలిపరిచయం
భవతీరాలను దాటించు అతిశయం
తలవని తలవంపుగా తనివితీరా
తిరుమలేశుని తిలకించడం
జన్మజన్మలకు దొరకిన పుణ్యఫలం
కోరినా కోరకున్నా
కమలనాధుడు కలసిరావడం
ఈజన్మకు కలిగిన భాగ్యం
ఆజన్మాతం తీర్చుకోలేని రుణం || దర్శనం||
=============================
కీర్తన 62

ఎన్ని లీలలో ఎన్ని మాయలో
ఎన్ని కథలో ఎన్ని కళలో
కనులకు ఏమి తెలుసు
జనులకు ఏమి తెలుసు
దేవదేవుని దివ్యలీలలు
మహాదేవుని మహామాయలు
కనులకు ఏమి తెలుసు
జనులకు ఏమి తెలుసు
ఆత్మలో నిక్షిప్తమైన
పరమాత్ముడే పరమోన్నతుడని ఎరుగని
పరంధాముని లీలలు పరమాత్ముని మాయలు
ఆత్మకు ఏమి తెలుసు
జీవాత్మకు ఏమి తెలుసు
కనవే మనసా ఎరుగవే జీవమా
ఏడుకొండల వేంకటేశుని లీలలు
వైకుంఠవాసుని మాయలు...
============================
కీర్తన 61

అయ్యా ... అయ్యా ... పెద్దయ్యా
అయ్యా... అయ్యా ... దొడ్డయ్యా
అఖిల జగాలకు అయ్యవైన పెద్దయ్యా ...
అయ్యలకే అయ్యవైన ఓ పెద్దయ్యా...
దిక్కులకే దేవుడవయ్యా ఓ దొడ్డయ్యా
ఏడేడు లోకాలు పదనాలు భువనాలు

పాలించే ఏడుకొండల వెంకయ్యా
అనంత లయలకు ఆద్యుడవై
పాండవ పోరున పార్ధ సారధి వై
వైరాగ్య సమయాన గీతానందుడవై
పాలించే పరిపాలించే అయ్యా ఓ పెద్దయ్యా...
ఆదరించి మము ఆదుకోవయ్యా వెంకయ్యా..
=================================
కాటుక కన్నులకు కలవరమా
గాజుల కరములకు కలకలమా
అందెల రవళులు ఆపతరమా
నినుమదిలో దాచుట నాతరమా
రవికకు బిగువలు కొంగుకు పొంగులు
బుగ్గకు సిగ్గులు మనసున మొగ్గలు
ఎదపై నగనగము, ఎదలో నీరూపము
ఎన్నడు ఎరుగని మాయామనఆనందము
నీతో బంధం భవబంధం నా తరమా
కృష్ణా! నీ గానము వదనము నా సొంతమా ...
===================================
కీర్తన 54

పురుషోత్తమ పద్మనయన ప్రణయిని.
పసుపు కుంకమ ప్రప్రదాయ పద్మావతి
సిరు గిరి సుందరి శ్రీహరి హృదయనివాసిని
సకలలోకేశ సత్యపాలక శ్రీనాధ సహధర్మణి
అష్ట ఐశ్వర్య సంతాన అనుగ్రహ ప్రదాయిని
భక్త వరద ఉదార విశాల వసుధారిణి ....
ప్రణామం ప్రణామం ప్రసన్నాక్ష్య పద్మావతి
పాహిమాం పాహిమాం ప్రపురాణ పద్మావతి
=================================
కీర్తన 53

శ్రీలక్ష్మమ్మని శ్రీనివాసుడు బ్రతిమలాడే విధానము చూడండి
పలుకవే బంగారమా
నవ్వవే నయగారమా
చిరునవ్వు నవ్వవే సింగారమా
ఆప్యాయత చూపవే అనురాగమా
అందాల కోమలమా ఆనంద భాష్యమా
ప్రేమతో పాసగవే పద్మపారిజాతమా
ఆ స్వర్గము వీడానే ఈ సిరికై వచ్చానే
ఏడేడులోకాలు వెదకి ఏడుకొండలు చేరానే
చేయిచాచి అడిగే వారెందరో
చేతులెత్తి మొక్కే వారెందరో
హరిని సిరికై చేయిచాచానే
చేరరమ్మన్నానే సింధూరమా
చెంత చేర రావే నీ చల్లని
వొడినీయ్యవే వయ్యారమా
ఈ హరికి సిరి నీవు తోడై
శ్రీహరి నై నిలిచిపోనీవే.....
పలుకవే బంగారమా
నవ్వవే నయగారమా
==============================
కీర్తన 52

ఈ జగతికి మూలం నీవు
ఈ జన్మకు ప్రాణం నీవు
నాధ జగన్నాధ హరిహరనాధ
ఏడుకొండల నాధ... శ్రీనాధ...
సత్యము నీవు ధర్మము నీను
జననం నీవు మరణం నీవు
సకలము సర్వము నీవే సర్వేశ్వరా....
హరిహరేశ్వరా శ్రీ వెంకటేశ్వరా ...
విధాతవు నీవు ప్రధాతవు నీవు
ప్రకృతి నీవు వికృతి నీవు ..
జీవాత్మా పరమాత్మానీవే పరమేశా ..
ఈశా పద్మపరమేశా వెంకటేశా ...
గోవిందా హరి గోవిందా
గోవిందా భజ గోవిందా
============================
కీర్తన 40

ఏలుకోవయ్యా స్వామి ఏడుకొండలవాడా
నేలుకోవయ్యా స్వామి నన్నేలుకో.....
ఎలుగెత్తి నీనామం ఎల్లవేళలా కొలెచెదనయ్యా
నిలువెత్తు నీరూపం దర్శించుటకై నిరీక్షించెదనయ్యా
ఏమారక స్వామి ఏడుకొండలవాడా
నామొర నాలకించగరారా నాస్వామిఏడుకొండలవాడా
ఎందున ఉన్నావయ్యా స్వామినని ఎవరు ప్రశ్నించినా
నెందునైనా గలనంటూ నిండైన వరాలు ప్రసాదించరా
ఏడుకొండలవాడా వెంకటరమణా సంకటహరణా
నేడుననుబ్రోవగ రారా నాస్వామిఏడుకొండలవాడా

================================

# Text and image sources, contributors, and licenses

## Text

- భక్తి పాటలు Source: http://te.wikipedia.org/wiki/%E0%B0%AD%E0%B0%95%E0%B1%8D%E0%B0%A4%E0%B0%BF%20%E0%B0%AA%E0%B0%BE%E0%B0%9F%E0%B0%B2%E0%B1%81?oldid=1273977 Contributors: Rajasekhar1961మరియు Anonymous: 1

## Images

- దస్త్రం:Ambox_wikify.svg Source: http://upload.wikimedia.org/wikipedia/commons/e/e1/Ambox_wikify.svg License: Public domain Contributors: స్వంత కృతి Original artist: penubag

## Content license